


# నీలం
(కథా సంపుటి)




సుబ్బరామశాస్త్రి

మ ణి మా లి క

౪

మూ ల్యం
అర్ధరూపాయి

ద్వి తీ య
ము ద్ర ణం

స్వ భా ను
వ సం తం

# నీలం





విద్వాన్
పైడిపాటి

నాల్గు నెలలు కాలేదు, పుస్తకం వెలువడి. నేను అనుకున్నట్టుగానే....రసజ్ఞులైన ఆంధ్రుల ఆదరాభిమానాలు రెండోకూర్పుకు గట్టి అవసరం కలిగించై. అందుకై తెలుగునాటికి నా ధన్య వాదాలు.

పుస్తకం చూచి తనంతట తానుగా మలి కూర్పుకు చేయందిచ్చిన మిత్రుడు శ్రీ కోనే మాధవరావుకు నే సర్వదా కృతజ్ఞుణ్ణి.

—పైడిపాటి విద్వాన్.




# నీలం

'మనియార్డ రున్నదండీ' అన్నాడు పోస్టుజవాను కవరిస్తూ. ఏదైనా పుస్తకాల బాపతేమో, ననుకుని "ఎంత ?" అన్నా. "పాతిక రూపాయ లండీ" అన్నా డతను. ఫారంమీద సంతకం పెట్టి చూశాను. మిస్ నీలం, యం. బి. బి. యస్. లాయుడ్సురోడ్డు, గోపాలపురం అని వుంది. కవరు విప్పాను. ఫలానా రోజు మెయిలులో బయలు దేరుతున్నా నని వైరు చేశాను.

నీలం అసలు పేరు నీలవేణి. ఆ అమ్మాయి, నేను, ఫోర్తు ఫారం దగ్గిరనుంచీ డివిజన్ మేట్సుము. అంతకుముందు క్లాస్ మేట్సుము మాత్రమే. ఫోర్తుఫారంలో కొచ్చేసరికీ ఆ అమ్మాయికి 11, నాకు 14. అట్టెండెన్సు రిజిస్టరులో నా పేరుముందు, ఆ పేరు తర్వాత. కాని సీట్సులోమాత్రం ఆ అమ్మాయి బెంచి ముందు మా బెంచి వెనుక. ఒకసారి నేను నాలుగ్రోజులు సెలవు పెట్టాను. మాసైన్సుమాస్టరు ఆర్కిమెడీస్ సూత్రం చెప్పారట! ఇంకా ఏవో చెప్పారుట. నేను క్లాసులోకి కాస్త లేటుగా కూడా వెళ్ళాను. ఆయన ఒక వరుసగా ప్రశ్నకు సమాధానం చెప్పలేని పిల్లలను బాదుకుంటూ వస్తున్నాడు. నేను నుంచున్నా. ఆ వరుసలో తర్వాత వాణ్ణి నేనే. అదే ప్రశ్న నన్నడిగారు. నేను వూరుకున్నా. చేయి చాపమన్నారు. మీరు చెప్పినప్పుడు నేను వూళ్ళోలేనండి అన్నా. "వీల్లేదు, అది సమాధానం కాదు, తర్వాత ఎందుకు తెలుసుకోలేదు! నీవు సెలవపెట్టడానికి నే జవాబుదారా" అన్నారు.

"నేను వూరునుంచి యీ తొమ్మిది గంటల బండికే నండి వచ్చా"నన్నా. క్లాసంతా గొల్లున నవ్వారు. ఆయనకు అవిశ్వాసం కలిగింది. "మన్ని ధిక్కరిస్తాడా" అనే అహం ముందుకు వచ్చింది. "చేతులు రెండు చాపు" అన్నారు. చాపాను. నాకు దెబ్బలు తినడం అభ్యాసం లేదు. పైగా ఎవరన్నా కొడుతున్నా చూడలేను. రెండుచేతులమీదా రెండు అరడజను వడ్డించారు. నేను కళ్ళు మూసుకునే వున్నాను. చాచిన చేతులు అల్లాగే వున్నాయి. ఒకవేలు దగ్గర చిట్లింది. పాపం ఆయనగుండె కరగి పోయింది. అంతటితో కొట్టడం ఆపేశారు. వెంటనే కుర్చీలో వెళ్ళి కూర్చున్నారు. మిగిలిన విద్యార్థులను వరుసగా ప్రశ్నించనుకూడ లేదు. నేను కళ్ళు తెరిచాను. ఒక్క మాటుగా జొటజొట నీళ్ళు కారినై. ఆ కారడంలో నా కెదురుగా తిరిగిన నీలం కళ్ళనిండా నీలాలు చూశాను. మాస్టరుగారి ముఖాన నెత్తుటిచుక్క లేదు. ఆయన కళ్ళుకూడా చెమ్మగిల్లకపోలేదు. ఆపూటకు పాఠం చెప్పడం మానేశారు. నీమనున్నం చాకుతో చెక్కి అంటించారు. పిల్ల లందరూ ఆయన కుర్చీలో కూర్చుండగానే నెత్తురుచేతిని చూచి వెళ్లారు. ఆయనకు అభిమానం కలిగింది. 'ఎవరైనా కొట్టాలని కొడతారా? ప్రిన్సిపుల్ పాటించాలి. అత నంటే నాకేం పగ?' అన్నారు. వెంటనే నీలం అందుకుని మంచిప్రిన్సిపల్ మాస్టారూ" అంది. నేను నిర్ఘాంత పోయాను. క్లాసంతా గొల్లుమని నవ్వారు. స్కూలు వదిలేరు. 'నీ నోట్‌పుస్తకం ఇల్లా ఇవ్వవోయ్, కాపీచేసుకిస్తా'నన్నా. "నీవు వారం రోజుల దాకా వ్రాయలేవు. నీ పుస్తకం యివ్వు. నేను కాపీ చేసేస్తా" నన్నది నీలం. ఇది మా ప్రథమపరిచయం.

వేసవి పరీక్షలు దగ్గరకు వచ్చినై. నీలానికి లెక్కలూ, తెలుగు వ్యాకరణం కాస్త మందకొడి. నా లెక్కలపుస్తకం చూచి యిస్తానని ఒకరోజున తీసుకుంది. మళ్ళీ యిచ్చిన తర్వాత చూతునుగదా దాంట్లో ఒకచిన్న వుత్తరం వుంది. "నన్ను లెక్కలలోనూ తెలుగులోనూ నువ్వే ప్యాసు చేయించాలి. పరీక్షలు దగ్గరకువచ్చినై. ఈలోపుగా యివి నాకు నువ్వు వచ్చేట్టుగా చెయ్యకపోతే గట్టిగా ఫేలై పోతాను. నువ్వు ప్యాసవుతావు. నేను యీక్లాసులోనే బహుశా యీ బెంచీమీదే వుంటాను." నేను సమాధానం వ్రాయలేదు. ఉత్తరం చూడనట్లుగా వూరుకున్నాను. మరురోజు ఒక 60 ఏళ్ళ బ్రాహ్మణుడు మాక్లాసు వరండాలోకి వచ్చాడు. మా మాస్టారును 'ఫలానా' కుర్రవాడిని ఒకమాటు పిలవండి అని చెప్పాడు. మా మాస్టారు నాకు చెప్పడంతో నేను వరండాలోకి వెళ్ళాను. 'ఇల్లా రావోయ్' అని ఇంకా దూరంగా తీసుకుపోయి నా వివరాలన్నీ అడిగి మీ వాళ్ళ నందరినీ నేను ఎరుగుదునని చెప్పి, ఆఖరుకు "నువ్వు చిన్నవాడవు కనుక చెబుతున్నాను. నాయనా! ఒకమాట విను. విద్య తెలిసివుండి చెప్పకపోతే అడివిలో ప్రయోజనం లేని వృక్షమై పుడతాడని వుంది. కాస్త మా అమ్మాయిని పరీక్షలయ్యేదాకా దగ్గరవుండి చదివించుదూ. కలిసిచదవడంలో నీ చదువూ గట్టి పడుతుంది" అన్నాడు. ఆయన బ్రాహ్మణుడు. నీలం కళావంతుల పిల్ల. నాకు వెంటనే ఏమీ తోచక "మీ అమ్మాయి ఎవ"రన్నా. "అహా! నీలవేణి! ఎరగవూ"? అన్నాడు. "మాస్టరు గారికి ఎక్కువ విషయాలు తెలుస్తాయి. చెప్పే

నేర్పు వుంటుంది. పోనీ ట్యూషన్ చెప్పించండి" అన్నా. ఆయన చీకాకుపడి "అబ్బా! యీమాటలకేం లేద్దు. మా అమ్మాయి ట్యూషన్ వద్దంటోంది. తెలుగు మాస్టరుకు లెక్కలు రావు. లెక్కల మాస్టరుకు .తెలుగువ్యాకరణం రాదు. అయినా ఒక గంట మొక్కుతీర్చుకు పోతారు. మీరిద్దరూఅయితే వచ్చేదాకా విషయాన్ని సంప్రదించుకోవడానికి వీలవుతుంది. చెప్పడం మరచిపోయాను నాయనా - తూర్పు వీథిలో డాక్టరుగారి సందు కవతలసందు మేడ. మీకు అంతరాయా లేమీ వుండవు. ఏదో పెద్దవాణ్ణి వచ్చి చెప్పానని గౌరవం అన్నా వుంచి రేపటినుంచి రా - నాయనా" అన్నాడు.

*　　　*　　　*

ఆ మరుకోజు పొద్దున నేను వెళ్లాను. నీలం వచ్చి నన్ను మేడమీదికి తీసుకువెళ్ళింది. గదిలోతివాసీమీద పరుపు పరచి వుంది. అక్కడ కూర్చున్నా. ఆ అమ్మాయి దాని కెదురుగా వున్న మరో పరుపుమీద కూర్చుంది. అవాళ శనివారము. స్కూలు లేదు. వడ్డీ లెక్కలో ఒకదానికి ఆన్సరు రాలేదు. అది వెంటనే నాకు యిచ్చింది. ఆఖరు స్టెప్పులో తప్పింది. ఆ తప్పు చూపించితే సరియైన ఆన్సరు వచ్చింది. ఇంతట్లో దర్వాజా తెరుచుకుని అవతలగదిలోంచి మడిబట్టతో వచ్చాడు వాళ్ళ నాన్న. 'నాయనా! ప్రసాదం పుచ్చుకో'మని కొబ్బరి ముక్కలు పెట్టాడు. తర్వాత 'అమ్మా! యిదిగో' అని ఆ అమ్మాయికి కూడా యిచ్చాడు. ఆయన మడి లక్షణం చూస్తే నా కాశ్చర్యం కలిగింది. ఆయన విచారంతో "ఇద్దరు

పెళ్లాలను చేసుకుంటే నాపటం నా నెత్తిని పొడిచి పోయారు, నాయనా! తర్వాత దీని తల్లికి కన్నెరికం పెట్టాను. అప్పటి నుంచి జీవితం ఇల్లాగే గడుస్తోంది; నాకు ఇది ఒక్కతే కూతురు, నాయనా!" అన్నాడు. "అబ్బ! పోనీయు వే. చదువుకోనివ్వకుండా నువ్వొకటే" అంటూ కాస్త సిగ్గుతో మారాము చేసినట్లుగా అంది. "చదువుకోవే అమ్మా - చదువుకో - చదువుకో నాయనా! ఇద్దరూ చదువుకోండి" అని ఆయన వెళ్ళిపోయాడు.

* * *

ఇద్దరమూ స్కూలుఫైనలు ప్యాసయినాము. 'తర్వాత ఏంచేస్తావోయ్' అంది నీలం. పైకి చూపించి "ఆకాశం గగనం శూన్యం" అన్నా. ఏమిటీ? ఇంటర్మీడియేట్ చదవ్వూ?" అంది. 'మావాళ్లు చెప్పించలేరన్నా.' ముఖం చిన్నపుచ్చుకు వూరుకుంది. 'దశానాం ఏకాదశ' నేను చెప్పిస్తా, మీ రిద్దరూ కలిసి చదవండి **F. A.**' అన్నాడు నీలం తండ్రి ప్రక్కగదిలోనుంచి. నీలం ఏనుగునెక్కింది. 'Loyola' లో జేరుదామోయ్' అంది. నేను మాట్లాడలేదు. 'ఏమిటోయ్, మనసిచ్చి మాట్లాడవూ !' అంది నీలం. "మావాళ్లు అంగీకరించరు. నన్ను విడిచి వుండలేరుకూడా" అన్నా. "ఎక్కడైనా ప్రవేశిస్తావా గుమాస్తాగా?" అంది. 'చెయ్యి, వేళాకోళం చెయ్యి' అన్నా. "తెలియకడుగుతున్నానోయ్, పోనీ కవిత్వం వ్రాస్తున్నావ్ కదా! విద్వాన్‌కు చదువుతావా" అంది. "ఏమో అంతా అయోమయంగా వుంది. నన్ను మాట్లాడించకు" అన్నా. నీలం కిక్కురు మనలేదు.

ఆ రాత్రి ఇద్దరం జట్కామీద సినిమాకు వెళ్లాం. నీలం మొహం పరీక్ష ఫెయిలయిన దానికంటె హీనంగా వుంది. రిజర్వుడులో కూర్చున్నాం. ఆవాళే కంసాలి యిచ్చిన వుంగరంమీద నీలం దృక్కులు ప్రసరించాయి. "ఏదోయ్ క్రొత్తవుంగరం వలె వుందే, బాగుంది. నీలజలం, దానిలో పద్మం, పైన మధుకరం, దానిలో పేరు, అంతా కవిత్వం" అంటూ తీసుకుంది. "ఇది ఇవాళే మా అమ్మ యిచ్చింది. చాలా విలువ గలరాయి" అని తనచేతి నీలపుటుంగరం చూడమని యిచ్చింది. ఉంగరాలు మారాయి. సినీమాలో నాయకుడు నాయికకోసం మంచి త్యాగంచేశాడు. నాయిక కేవలం పతిశీల. సినీమాఅయిం తర్వాత జట్కాలో వస్తూంటే "నేను కూడా చదువు మానేస్తా" అంది గద్గదస్వరంతో. 'ఎందుకని' అన్నా. 'మూడుసంవత్సరాల సాహచర్యం' అంటూ కంట నీరు పెట్టింది. "నీవు చదివితీరాలి- నాతో నం తేమిటి, పిచ్చితనం" అన్నా. "నేను జ్ఞాపకంవుంటానా మీకు?" అంది. "మీకు ఏమిటి?" అన్నా. బండి దిగింది నీలం. 'రేపురాత్రి బండికి ప్రయాణ మంటున్నారు మా నాన్న మా అమ్మా' అంది. "రేపు పదిగంటలకు వస్తాలే" అన్నా. జట్కా మా యింటికి నడిచింది.

* * *

మరురోజు 10 గంటలకు నీలం యిల్లు ఖాళీ.

* * *

క్వీన్ మేరీస్ కాలేజీలో చేరిన తర్వాత ఒక వుత్తరం వచ్చింది. ఆ రోజున వర్జ్యం రాత్రి వుండడంచేత పొద్దున్నే

అర్జంటు ప్రయాణం తాకిందని. నీలం వుంగరం నా దగ్గరే వుండిపోయింది. తాను తర్వాత ఇక్కడికి వచ్చినప్పు తీసు కుంటానని వ్రాసింది నీలం.

ఆ వుత్తరానికి సమాధానం వ్రాశాను. తర్వాత కారణాంతరాలచేత చోటు మార్చవలసివచ్చి ఒక పల్లెటూళ్లో వున్నా - మళ్ళీ ఆరు సంవత్సరాలకు మనియార్డరు - కవరు ఒకేపర్యాయం రావడం.

* * *

సెంట్రల్ స్టేషన్‌లో దిగాను. ఆవరణలో చూచాను. మిస్. నీలం, యం. బి. బి. యస్. అనే బోర్డుగల కారు కన బడింది. వెంటనే ఆ కారుదగ్గరకు వెళ్ళాను. 'మీరేనా ఫలానా' అంటూ ఒక లేడీడ్రైవరు వచ్చింది. కారులో కూర్చున్నా- క్షణంలో ఇంటిదగ్గర దిగాం.

* * *

"విన్నానోయ్- నీవు ఒక గట్టి స్థానం కలకవివని ఆధుని కుల్లో. నీవు యీ చదువు మానినందువల్ల నా కేమీ కించ లేదు. విద్యవల్ల అసలు కలుగవలసింది ఆంతరంగికంగా జ్ఞానం బహీరూపంలో ధనం. యశస్సుకూడా ఒకరకంగా బాహిరమైన దనే చెప్పవచ్చు. అట్టివి కలిగిననాడు మరొక చదువు దేనికి? నేను మా అమ్మాయికీ చదువుచెప్పించినందుకు విశేషం తృప్తి పడడంలేదు. కాని కొందరకు ఉపకారం చేయడానికి అవ కాశం గల వృత్తి అవడంవల్ల ప్రయోజనం లేకపోలేదు. అమ్మాయే డబ్బు సంపాదించాలీ అనే నియమం లేదు. ఏదో

వెనుక వున్నది చాలు. మీరు మా అమ్మాయి వుత్తరానికి సమాధానం వ్రాయలేదేం?''

"నేను చోటు మార్చాను. అందుచేత నా కంద లేదు. నేను మళ్ళీ రెండువుత్తరాలు వ్రాశాను.''

"ఓహో అయితే అప్పుడు కలకత్తాలో వుండివుంటాం. మొన్న రేడియోలో మీ పుస్తకాల విమర్శ జరిగినతర్వాత హిందూలో రివ్యూ చూచినతర్వాత మీభోగట్టా తెలిసింది. సర్వీస్ చేయడం మాఅమ్మాయి కిష్టంలేదు. ప్రైవేటుఆసుపత్రి పెట్టింది. ఎప్పుడు అక్కర లేదనుకుంటే అప్పుడే అదికూడా మానెయ్యవచ్చు.''

'బాగుంది' అన్నా.

"బాబూ'' అని కుర్చీ కాస్త దగ్గర జరుపుకున్నాడు.

"మా అమ్మాయికీ జోడు కలుపుదామని సంకల్పం'' అని వూరుకున్నాడు.

నేను అప్రయత్నంగా "మీ అమ్మాయిని పెళ్లిచేసుకోవడానికి ఒక పాటివాడికి గుండె ఆనదు'' అన్నా.

'ఏం'అన్నాడు ఆయన.

"ఆ-ఏమీలేదు. విద్య, రూపం, ధనం, శీలసంపత్తి-వీటిలో యీడుగా వుండాలికదా''అన్నా.

"ధనం - రూపం: ఇవి బాహిరమైనవి. అంతస్సు బాగుండాలి నాయనా! దయ సత్యం శౌచం వుంటే చాలు. చూడు, మీరిద్దరూ ఎల్లాఒకర్ని ఒకరు అర్థం చేసుకున్నారో-

యౌవనప్రాదుర్భావం నుండీ ప్రేమ చక్కని దోహదం పొందింది నాయనా! నీవు స్వీకరించాలి'' అన్నాడు.

"నేను వివాహితుణ్ణి, తెలుసుగా'' అన్నా.

"నాకే కాదు. నీలానికి కూడా తెలుసు.''

"క్షమించండి. వేశ్య నాకు యిష్టం లేదు.''

ఆయన వూరుకున్నాడు.

"అయినా పరస్త్రీ సంబంధం పాపం.''

ఆయనకు కోపం వచ్చింది. ఆ సంగతి ఆయన కళ్ళల్లో మాత్రమే తెలుస్తోంది.

'పూర్వులు తెలియనివారు, మీరు తెలిసినవారు.'

'ఇల్లా అనడం చాలా తేలిక' అని అనుకుని వూరుకున్నా.

"వేశ్య పరస్త్రీ కాదు'' అన్నాడు.

'చిత్రమైన విషయం' అన్నా.

"నీకు చిత్రమైందే - పరస్త్రీ అంటే ఏమిటి? పరుని స్త్రీ అని అర్థం. పరుని స్త్రీ వివాహం అయితే కదా కావడం? వివాహం లేనప్పుడు కన్యకదా? కన్య నందరును కోరవచ్చును కదా! వేశ్య నిత్యము కన్యయే కదా! ఇతరములైన విషయాలను అల్లా వుంచితే వేశ్యతో వుండుట పాతకం మాత్రం కాదు. నే నందువల్లనే నా జీవితాన్ని ఇల్లా గడిపింది'' అన్నాడు.

ఇంతలో నీలం పక్క గదిలోనుంచి తలుపు తోసుకు వచ్చింది. "కార్ రడీ" అంది.

నేను లేచాను. మెరీనాబీచ్ కి వెళ్లాం.

*  *  *

ఒక్క పావుగంట యిద్దరం మాట్లాడలేదు. "మీరు నన్ను చదువుకోమని ఆజ్ఞాపించారు. తర్వాత ఒక తెర మనయిద్దరిమధ్యా చాలారోజులు ఉండిపోయింది. ఒకరి ఉనికి ఒకరికి తెలియదు."

"నిజం" అన్నా.

"మన ఉభయుల ఉంగరాలు ఏ ముహూర్తాన మార్చుకున్నామో—"

నేను ఊరుకున్నా.

"మీ కెంతమంది పిల్లలు" అంది నీలం.

"ఇద్దరు" అన్నా.

'తీసుకురాక పోయారా, ఒక్కరినన్నా ?' అంది.

ఊరుకున్నా.

"మన హైస్కూలు జీవితంలో నాకు యీ రోజువరకు ప్రతి చిన్నవిషయం జ్ఞాపకముంది. చాలా మనోహరమైన రోజులు. చిలుక గోరువంకల్లాగ ఉండేవాళ్ళం. నాకు మిమ్మల్ని వదిలి చదవడం ఇష్టంలేదు. చాలాకాలం బెంగగా వుండేది. క్రొత్తలో జ్వరంకూడా పడ్డాను" అంది.

'పాపం' అన్నా.

"ఈ నదికి కేవలం సముద్రి మిప్పుడు సన్నిహిత మైంది" అని నా మీాది కొరిగింది.

"నీలం - నాకు భార్య, ఇద్దరు పిల్లలూ వున్నారు. నీవు ధనవంతురాలవు. నీ జీవితం కష్టాన్ని వరించడం నాకు బాగుండ లేదు."

"ఒకపత్రిక - గంభీరమైన బంగాళాఖాతం, ఒకపత్రిక - విద్యాసముద్రులు మీారు. ఏదో ఒకటే శరణ్యం. నా హృదయం ఆ వుంగరంతో ఆరోజునే మీాకు సమర్పించా. నాకు వివాహం అప్పుడే జరిగింది. కాని ఒక దైవికమైన ఎడబాటు కలిగింది. ఆశాబంధంచేతనే నేను ఇన్నాళ్లు జీవించాను. సర్వము తెలిసిన మీాయందు ఒక జీవితం ఆధారపడి వుంది."

నా హృదయం కరిగిపోయింది.

*  *  *

రాత్రి రెండుజాములు కావచ్చింది. నీలం నెమ్మదిగా కారు నడిపించి ఇంటికి తీసుకు వెళ్ళింది.

*  *  *

# దాహం

"నీ అధరోష్ఠ రక్తిమ ఈ గులాబీకి లేదు సుమా!" అన్నాడు శ్యామలరావు.

లలిత అప్పుడే అదరిన పెదవిని తడుపుకుంటూ తల వంచుకొని తేల్చిన కళ్లతో ఉద్యానవనంలో భర్త చూపిన గులాబీవంక చూస్తోంది. అదే సమయంలో ఒకమారుతం వచ్చి గులాబీ రెమ్మను నూగాడ చేసింది. ఆ స్పందనలో తదభిముఖుడై వచ్చే అళికుమారునికి స్వాగతం యిచ్చిందా వికసితారుణపుష్పం. ఆ దృశ్యాన్ని చూసిన లలిత ముఖంలో లజ్జావిలాసం, శ్యామలరావు ముఖంలో ప్రకృతిసౌందర్యోపాసనాతృష్ణ గోచరించాయి.

వాయువు మళ్లీ వెనక్కి వీచింది. భృంగస్పర్శ కాకుండానే వెనక్కి వెళ్లిపోయిందా పుష్పం. ఆ వెళ్ళడంలో - ఎదురుగాలి వీవడంచేత బలవంతంగా వెనక్కి వెడుతూ వున్నట్టు స్పష్టమవుతోంది. వెంటనే అదృష్టవంతుడైన మరో అళికుమారుడు ఆ పుష్పసౌరభ్యానికీ సౌందర్యానికీ మనసుపడి దానిమీద వాలిలాడు. ఆ గాలి పాటులో గులాబీపూవు చిందరవందరగా కదలినట్లు కనిపించింది. వాయువు స్తబ్ధమయింది. గులాబీ, భృంగం ముచ్చటగ వున్నారు. మొదటవచ్చిన తుమ్మెద గాలిసుడిలో ఏమయిందో.........

ఆ దంపతులు చూచారా దృశ్యం.

'ఎంత అదృష్టవంతుడవోయ్' అనుకున్నాడు, వాలిలిన

భృంగాన్ని చూచి శ్యామలరావు. రెండు కన్నీటిబొట్లు విడిచింది లలిత, అతనికి కనపడనీయకుండా.

*　　　*　　　*

పునస్సంధాన మయినా మనసు విప్పి లలిత శ్యామలరావుతో మాట్లాడటంలేదు. ఆమె ఒంటరితనానికి అలవాటు పడినట్లూ శ్యామలరావుకు గోచరించలేదు. ఆమె వేడి నిట్టూర్పులు విడవటం, తలగడ అప్పుడప్పుడు కన్నీటితో తడిసివుండడం చూచాడుకాని, పుట్టిల్లు విడిచిరావడంచేత కలిగిన బెంగగా అతడు నిశ్చయించుకొన్నాడు. ఆమె కే విషయంలోను లోపం రానీయకుండా మాత్రం చూస్తూన్నాడు.

*　　　*　　　*

రోజులు గడచి పోతున్నై. తాను ప్రేమించిన మోహానుడికి కాకుండా పోయింది; తనను పెళ్ళిచేసుకున్న శ్యామలుడికి హృదయ మీయలేకుండా వుంది.

శ్యామలుని ఎట్లా ప్రేమిస్తుంది.

ప్రేమించ కేం చేస్తుంది?

ఒక సమస్య లలితహృదయంలో సుడిగుండాలు తిప్పుతోంది.

మధ్యాహ్నం పదకొండుగంట లవుతుంటే, కిటికీచువ్వల్లోంచి ఉద్యానవనం వంక చూస్తూ గదిలో పర్యంకంమీద కూర్చుంది లలిత, తాంబూలచర్వణంతో. ఆ గదికి నాలుగైదు గజాల దూరంలో ప్రహారీగోడ వుంది. ఆ తర్వాతరోడ్డు. భర్త కచేరీకి వెళ్ళాడు. ఆ సమస్య తన హృదయాన్ని మెలి

వేస్తోంది. దుఃఖభారంతో జీవిత మంతా గడిపేకన్న ఒక్క సారిగా త్యాగంచేస్తే... ప్రాణాన్నే... తాను ప్రేమించిన, తనను ప్రేమించిన మూర్తికోసం త్యాగం చేస్తే... తన జీవితానికి ధన్యత అనుకుంది. కాని వెంటనే గుండెల్లో ఏ మూల నుంచో "అది తప్పు సుమా" అని తెలిపే గీతం ఏదో అవ్యక్తంగా ధ్వనిస్తున్న ట్లనిపించింది.

అప్పుడే ఆ గీతంనుంచే కాబోలు వరుసను అందుకొని అస్పష్టమైన అక్షరాలతో పరిచితకంఠనాదం వినవచ్చింది. ఆ కంఠనాదమే ఆమె మనఃఫలకంమీద ఒక రేఖా చిత్రం చిత్రించింది. వెంటనే వెళ్ళి ఆమె తలుపుగడియ తీసింది. పాటగాడు ఆఖరిపాదాన్ని పూరిస్తూ సందు మళ్లేడు.

వెంటనే తెరచాప కెదురుగాలి వేస్తే వచ్చి ఒడ్డును కొట్టుకున్న పడవకుమల్లే వచ్చి సోఫామీద కూలబడింది. "ఆత్మహత్య పాపమా!" తనకు నిర్ణయం కాలేదు. మనసా వరించిన వరుణ్ణి వదలి తద్దృష్ట్యా అన్యపురుషుడితో సంసారం చేయడం పుణ్యమా!

ఒక్కసారిగా యీ వూహాలో తన భర్త స్మృతి పథానికి వచ్చాడు. తాను ప్రేమించిన వ్యక్తికంటె మిన్నయైన దేవచ్ఛాయ, తననే కావాలని మనసా కోరి వివాహం చేసుకున్న వ్యక్తి—సంపాదనకల వ్యక్తి—ఒక్కమారుగా మనోనేత్రానికి గోచరించింది. తనవంక ఆత డిన్నాళ్ళనుంచీ ప్రేమతో చూచే చూపులనూ దానికి బదులుగా తాను చూచే జాలి చూపులనూ ఒక్కసారిగా వూహించుకుంది. తా నొక వ్యక్తికి

ఘోరాన్యాయం చేసినట్లు వెంటనే గోచరించింది. హఠాత్తుగా తన భర్త తాను ఉద్యానవనంలో కూర్చున్నప్పుడు చూచిన దృశ్యం జ్ఞప్తికి వచ్చింది. నోరులేని ఆ పుష్పం వూరుకున్నది సరే - నోరుగల తాను మాత్రం చేసేదేమిటి ? కారకత్వం ఆ పుష్పాని కెట్లాగైతే లేదో - తనకు అట్లాగే......దానికి కారణమో.. సుడిగాలి. తనకో......ప్రారబ్ధమేమో!

పన్నెండు వసంతాలు గడిచిన ఒక బాలిక శ్యామల రావుగారి గుమ్మంలో నుంచునివుంది. దారే పోయే బైరాగి దృష్టి ఆ అమ్మాయిమీద పడింది. శిరఃకంపనం చేసి జీర గొంతుకతో తెమల్చుకొని తెమల్చుకొని అతడు ఏదో పాడుతున్నాడు.

ఆ బైరాగిదృష్టికి తాళలేకపోయింది ఆబాల. ఆ పాట వినగానే, లోపల చంటిపిల్లవాడి ముంగురులు దిద్ది జడ వేస్తున్న లలిత కేదో హృదయంలో కలచినట్లయింది. వెనుక తా నాత్మహత్య చేసుకో పోయేటప్పుడు తన హృదయగీతానికి అనుపల్లవిగా ధ్వనించినదాని పోలిక వుంది యీ కంఠస్వరంలో. హృదయంలో అత్యంతమైన ఆందోళన కలిగింది. సగంలోవున్న జడ వదలి వీథిగుమ్మంలోకి తనకు తెలియకుండానే పరుగెత్తుకు వచ్చింది లలిత.

భ్రమా ప్రమాదము
భ్రమా ప్రమాదము
భ్రమ విడిచిన లేదూ          జగమూ

అనే గీతాన్ని పూర్తిచేస్తూ ఆబైరాగి సందు మళ్లాడు. ఆ మళుపులో ఆ బైరాగి భుజంమీద వున్నమూటతప్ప లలితకు మరేమీ కనుపించలేదు. రెప్పపాటు నిలబడి నిట్టూర్పుతో "ఇప్పుడిల్లా వెళ్లిం దెవరే, వాసంతీ!" అంది బాల వంకచూచి-

"ఏమో - ఎవరోనే అమ్మా. బైరాగి-నావంక అదేదో విధంగా చూసి పాట మొదలెట్టాడు" అంది వాసంతి.

మారు మాట్లాడకుండా ఇంట్లోకి వచ్చింది లలిత ఆమె హృదయంలో ఒక పెద్ద తుపాను రేగుతున్నట్లుగా వుంది.

" గేదగి పూవును
కేల చూపగా
నాదనుకొనినాడ... దేవా...
నా దనుకొనినాడ.

పూవును చూపీ
ముండ్లను నాటితి
పోని మ్మిదియేగా... దేవా...

అనేపాట వినిపిస్తోంది. తన హృదయాన్ని అరచేతిలో పిండగలిగినట్లుగా వుం దా పరిచితస్వరం. అది అతని గొంతుకలో జీవమా! తన హృదయవీణపై తనకు తెలియకుండా స్వరించే భావగీతమా! ఆహా! పుష్కరంనాటి స్థితి మరల జ్ఞాపకానికి వచ్చిందే...ఆ హతాశుడైన అభాగ్యు డెవడో?

* * *

అది మండువేసంగి. ఎనిమిదిగంటలకే తలుపు తెరవ డానికి శక్యంకాకుండా వుంది. పదిగంటలకు శ్యామలరావూ, పిల్లలూ భోజనం చేశారు. లలిత వంటిల్లు సవరిస్తోంది. ఆ గాడ్పులోనే లీలగ మామిడిపళ్ళకేక వినిపిస్తే తలుపు తీసి కొన్ని మామిడిపళ్లు కొన్నాడు శ్యామలరావు. కావడివాడూ దప్పితీర్చుకోని వెంటనే తలుపు ఓరగావేసి వెళ్లిపోయాడు. వట్టి వేళ్లతడిక లడ్డుండటంచేత శ్యామలరావు వరండాలోనే కూర్చు న్నాడు. ఇంతలో వాసంతి తమలపాకులూ, వక్కలూ తెచ్చి, అక్కడ వుంచింది. తాంబూలచర్వణం చేస్తూ అత నింట్లోకి వెళ్లి శయనిద్దా మనుకుంటూ వుండగా- వీధివాకిట్లో- నిప్పులు చెరిగిపోతున్న వడలో—"అబ్బా! దాహం! దేవుడా!" అనే కేక వినిపించింది. వెంటనే అతికష్టంమీద అతడు వాకిట్లోకి వెళ్లిచూశాడు. ఒక బైరాగి బొబ్బలెక్కిన కాళ్ళతో తూలి పోతూ మళ్లీ అల్లాగే కేకపెట్టాడు. శ్యామలరావు అబ్బా యిని రమ్మని కేకేశాడు. సముద్రమధ్యంలో మునిగిపోతున్న వాడికి తెప్పకొయ్య దొరకినట్లుగా అతనికి ప్రాణం లేచివచ్చి తనకు తెలియకుండానే తన శరీరాన్ని శ్యామలరావుగారి వాకి ట్లోకి జేరేశాడు.

"అమ్మా- వాసంతీ - పాపం చల్లని మంచినీళ్లా అబ్బా యికి పోయవమ్మా - అట్లాంటివాళ్ల ప్రాణం నిలిపిందే నిలపడం" అన్నాడు శ్యామలరావు.

జాగ్రత్త పరచిన చల్లని మంచితీర్థం వాసంతి తీసికొని వచ్చి ఆ అబ్బాయి దగ్గరవున్న కమండలంలో మొగం ఒక

పళ్ళికిలకు త్రిప్పి పెదవి విరుస్తూ పోసింది. ఎంతో ఆప్యాయంగా తాగిగాడా పిసాసి.

"ఎవరవు నాయనా! పాపం! సంసారం విడిచిపెట్టడానికి కారణం ఏమిటి? ఏదో కష్టాలు అనుభవించిన వాడి మోస్త రుగా కనిపిస్తున్నావు" అన్నాడు శ్యామలరావు నెమ్మదిగా.

"అదంతా - ఒక భారతం లెండి - మళ్ళీ ఎందుకా గొడవ? మరచిపోదా మనుకున్నా మళ్ళీ సెల వేయడం మాన లేదు. అలాగే యీ మధ్యకూడా—"

"మేము వినవచ్చునా?"అన్నాడు శ్యామలరావు.

"నా కింకా దాపరికం ఏమిటి- చెబుతాను. చెబితేనే కొంత భారం తగ్గుతుందేమో"అని అంటూ వాసంతి నంక చూసి కంపితస్వరంతో, 'అమ్మా! కొంచెం దాహం వుంటే తెప్పిద్దూ! నీ కడుపున పుడతాను' అన్నాడు బైరాగి.

శ్యామలరావు వాసంతి వంకకు ఒకసారి చూడడంతో ఆమె చిక్కని మజ్జిగ ఒక గ్లాసుతో తీసికొనివచ్చి "కమండ లంలో పోస్తే చిలుమూరి పోతయ్యేమో" అంది.

"పోనీ-అదే అక్కడ వుంచ"మన్నాడు శ్యామలరావు. ఆ బైరాగి గ్లాసు నెత్తి ఆ మజ్జిగను రెండు గుక్కలుగా త్రాగి ఒక్క తేనుపును తేన్చాడు, చాలన్నట్లుగా తల వూపుతూ.

"ఈ దాహమైతే చల్లారింది కాని, అసలు నాలోవున్న దాహం చల్లారేది కాదు. అది జన్మపర్యంతం వుండవలసిందే అట్లా" అంటూ తన కథను ప్రారంభించాడు.

"అసలీ దాహం ప్రారంభించింది నా పద్ధెనిమిదో ఏట. నేను పెళ్లికని మా బంధువులయింటికి వెళ్ళాను. అది విరియ పూసిన వసంతం. అళికుమారుల కోలాహలాలు మిన్నుముట్టినై. మేజువాణీ ప్రయత్నాలనీ - అవనీ, ఇవనీ అందరూ పెళ్లి సందట్లో వున్నారు. మే ముండే విడిదికి చాలా పెద్ద ఆవరణ వుంది. ఒకప్రక్క పంపూ, వేరొకప్రక్క నూయికూడా వున్నాయి. నూయి వున్న ప్రక్క అరటి మొక్కలూ, కొబ్బరి మొక్కలు, మల్లెలంట్లూ మొదలైన రకరకాల మొక్క లున్నాయి. వాటి కింకా దూరంలో ప్రహారీగోడకు దగ్గరగా సంపెంగ పచ్చపూ మొగలీ వున్నాయి. ఒకరోజు సాయంత్రం ప్రకృతి సౌందర్యపిపాసినైన నేను ఆ ఆవరణలోకి వెళ్ళాను. అనుకోందే - అక్కడ - ఒక దివ్యసుందరవిగ్రహం గోచరించింది. సుమారు పన్నెండేళ్ళుంటాయి. విచ్చీ విచ్చని గులాబిపువ్వు. కూడాయిద్దరు పిల్లలుమాత్ర మున్నారు. మిగిలిన పేరంటా ళ్ళంతా మేజువాణీ సందడిలో లోపల ఎక్కడో వున్నారు.

నేనూ ఆ అమ్మాయి వంచబోతున్న గులాబీ రెమ్మదగ్గరకు వెళ్లాను. ఆ రెమ్మమీదనే నేనూ చేయి వేయబోయాను. ఇంతలో ఆ అమ్మాయి సిగ్గుతో మెలిచిన భ్రూభంగంతో వంచిన రెమ్మ వదలి పక్కనేవున్న గన్నేరుచెట్టు దగ్గరకు వెళ్ళబోయింది. ఆ వదలడంలో ఆ రెమ్మ వచ్చి నా చెంపకు కొట్టుకుంది. పూవు చివర వుండడంచేత పూవు తగలలేదు. రెమ్మకు వున్న ముళ్ళు కొంత బాధ కలిగించాయి. ఈ

దృశ్యాన్ని చూసి ఆమె వెంటనే వున్న బాలికలు ముత్యాల సరం తెగినట్లుగా నవ్వారు. ఆ అమ్మాయి వాళ్లిద్దరివంక చురుక్కున ఒక్కచూపు చూసి ముందరకు సాగింది. ముందు కాలి పాదంమీద భారం మోపి ఒక్కసారిగా వెనక్కి తిరిగి "ఊరికే అల్లా విరగబడి నవ్వకపోతే యీ పూలన్నీ దేంట్లో పోస్తారు? పూలసజ్జ తీసుకురారాదూ, ఇంటికెళ్లి!" అంటూ కసిరింది.

వాళ్లు నేను తీసుకొస్తానంటే నేను తీసుకొస్తానని పంతాలు వేసుకొని లోపలకు పరుగెత్తారు. వాళ్ళు మలుపుతిరగడం చూసి నావంక జాలిగా చూసిం దా అమ్మాయి "పాపం! రెమ్మ తగిలిందా" అని నన్నోదారుస్తున్నట్లు—

"అమ్మాయీ - మీ దీ వూరేనా" అన్నా రెండడుగులు దగ్గరగా వెళ్ళి.

"ఊ"అంది ఇంకో అడుగు ముందుకేస్తూ ఆ అమ్మాయి.

"ఇదిగో పాపం - నువ్వు కోసుకోవాలనుకున్న పువ్వు" అని చేతి కందించపోయాను.

ఆ అమ్మాయీ ఏదో మాట్లాడబోయింది కాని ఏమన డానికి తోచక వులిక్కిపడి ఇచ్చే పుష్పం వద్దనడానికి వీలులే నట్లుగా పుచ్చుకుంది.

"మీ యిల్లెక్కడ?" అన్నా అక్కడున్న తీగెమల్లెను వంచుతూ. "పై వీథిలో చివర డాబా" అంది గన్నేరు కిర్రింద పూలు కోస్తూ.

తండ్రిపేరూ, ఆ అమ్మాయిపేరూ అడిగి తెలుసుకున్న తర్వాత—

"మేజువాణీకి వెళ్ళలేదేం, అమ్మాయ్?" అన్నా.

"వెళ్ళాలి. అప్పుడే పూలచెండ్లాడరు"

అంటూ "ఇందిరా - ఇందిరా"

అని కేక వేసింది, వెళ్ళవలసిన త్వరను సూచిస్తూ.

"అన్నట్టు-నువ్వే పూలబంతులను కడదామని కాబోలు యీ సన్నాహమంతా"

అన్నా, రెప్పలు పైకెత్తి సమాధానంకోసం నిరీక్షిస్తున్నట్లు.

ఆ అమ్మాయి రెప్పలు పైకెత్తి చిరునవ్వు నవ్వుతూ శిరస్సు వంచింది.

"నా స్వచ్ఛమైన హృదయాన్నంతా నీకే అర్పిస్తున్నా" అన్నట్లుగా నేను కోసినమల్లెలను దోసిలితో పట్టి "ఇవిగో" అన్నా ముక్తసరిగా. ఆ అమ్మాయి స్పందిస్తూన్న వక్షస్థలంపైన పాముకుబుసంవంటి పైట సరిచేసుకొంటూ "నే నిటవరకే నా హృదయాన్నర్పించా నన్నట్లు క్రీగంటిచూపులు తనదోసిలి మీదుగా నా దోసిలికి ప్రసరింపచేసింది.

ఆ మధురక్షణాన్ని నిమిషమన్నా చేద్దామనే తలంపుతో వేలిసందున పూవు లేవో సర్దుతున్నట్లు నటిస్తూ ఆలస్యం చేశాను.

తన్మయుల మిద్దరం. ఆకు రాలు చప్పుడుతో ఆ పిల్లలు వస్తున్నా రనుకొని నాకు తెలియకుండానే పూలు ఆమెచేతుల్లో వివాహ సమయంలో భార్యచేతిలో తలంబ్రాలు పోసేటప్పుడు పొందే సంతోషంకన్న పదిరెట్ల ఉత్సాహంతో - పోశాను.

మరు నిముసంలోనే పిల్లలూ పూలసజ్జతో వచ్చారు. చెట్లు చాలా అడ్డువుండడంచేత వాళ్లకి మేముగాని మాకు వాళ్లుగాని కనిపించలేదు. నే అక్కడ వుండగానే-ముందర విని పించిన అలికిడికీ ఆ అమ్మాయి త్వరగా రెండడుగు లేసి కొన్ని గుబురుచెట్లకు అవతలనే వాళ్లను కలుసుకొని ఆ పూలు సజ్జలో పోసింది. అక్కడనుంచే 'ఇవి చాలనుకొని' వారు వెళ్లారు. నాకు దాహ మయినట్లుగా వుంది. ఆ దాహం తీరడంకోసం పంపుదగ్గఱకు వెళ్లి మంచినీళ్ళు పుచ్చుకున్నాను. కానిఊహల మీాద వూహలు సాగుతూవున్న నాకు దాహం తీరినట్లు కనిపించలేదు.

* * *

మర్నాడూ ఆ వేళకే నేను ఆవరణలోకి వెళ్ళాను. నాలుగుప్రక్కలా చూశాను. ఎవరూ కనుపించలేదు. నిన్న వచ్చినవా ళ్ళీరోజునకూడా తప్పకుండా రావా లని నిబంధ నేమో అని అనిపించింది నా ప్రాణానికి. ఎవ్వరూ కనపడక పోయేసరికి నా గుండెను నాకు తెలియకుండా పాతాళ లోకానికి కుక్కమూతివాళ్ళు గుంజేస్తున్నారేమో అని అనిపించిండి.

కానీ - సమాశ్వాసంగా వుంటుందేమో నని క్రిందటి రోజున మల్లెపూలు దోసిటితో పోసిన ప్రదేశానికి కాళ్ళను నడిపించాను.

ఎఱ్ఱని పరికిణీ, ఎఱ్ఱని జాకెట్టూ, నల్లని వోణీతో మంద మందంగా పూలు కోస్తున్న పూబోడి కనిపించింది. ఆ అమ్మాయిని చూసేసరికి సంతోషం పుక్కిలింత లైంది

మరొక అడుగు ముందరకు వేశాను. ఆ అమ్మాయి అభిముఖంగా వుంది.

ఇంతలో ఒక గండు కోయిల 'కుహూ'మని కూసి అదే కూతను రెట్టిస్తూ తుఱ్ఱుమని ఆ అమ్మాయి మీదుగా ఎగిరి పోయింది. బెదరిన లేడిపిల్లకు మల్లే ఆ బిత్తరి వెనక్కి తిరిగి చూసింది.

'ఫరవాలేదంటూ— వంచి, కోయిల కూతకు బెదరి అప్పుడే వదలిన గన్నేరు రెమ్మ దగ్గరకు, నేను కూడా వెళ్ళాను.

'స్త్రీలు సహజభీరువు'లన్నా నవ్వుతూ.

"పాత్రసూచన బాగా నిర్వహించింది కోయిల"

అంది దూరంగా జరుగుతూ ఆ పిల్ల.

"సాహిత్యం బాగా చదువుకొన్నా మని ధ్వనింపచేసే ప్రగల్భరాండ్రు కూడా"

అన్నా, నే నొక గన్నేరు పూవు కోస్తూ.

"ఇందిర నడిగి తెలుసుకున్న తర్వాత ఎన్ని ధ్వన్యా లోకా లన్నా చేస్తా"రంది!—

ఆ అమ్మాయి, మరొక రెమ్మమీద చేయివేసి.

"మా తమ్ముడికి తినుబండారాలు పెట్టి నా విషయం కనుక్కున్నది ఒక అమ్మాయ్ - అని తెలుసుకున్న తర్వాతే ఇందిర నడిగినా సుందరి నడిగినా" అన్నా గర్వంగా.

"అవును- ఆ యింట్లోకి వెళ్ళే పిల్లలతో ఆడుకొమ్మని తమ్ముడికి ఇల్లు చూపించిన సంగతీ విన్నా"మంది తల వూపుతూ.

"ఈ పుష్పం - ఇంకా ఎవరికి వాగ్దత్తం కాలే దను కుంటా"నన్నా.

ఆ అమ్మాయి మాట్లాడలేదు.

'వసికరశ్రితో పని సవరించే వ్యవసాయదారుకో, ఇరవై నాలుగు గంటలూ చాకిరితో కుమిలిపోయే గుమాస్తాలకో పరిణయం అవుతూ వుంటారు కళాప్రియులు, కోమలాంగులు'

అంటూ

"పాపం! అందలేదా - ఆగు ఆగు, నేను వంచుతాను" అని చివర రెమ్మనున్న గన్నేరు పూవును ఆ అమ్మాయికి అందీ అందనట్లుగా వంచాను. ఆ అమ్మాయి ఆ పూవు నందుకో బోయే సరికల్లా ప్రమాదవశంచేత చేజారినట్లుగా ఆ రెమ్మను వదిలేశాను.

ఆ పూవు చికిలిస్తూ చివరను వెళ్లి కూర్చున్నది. గర్భాధానం పీటలమీద కూర్చున్న దంపతులను చూసి కిచకిచలాడే కన్నెకుమల్లే ఆ అమ్మాయి నిరాశ, సిగ్గు కన పరచే విశాలమైన నేత్రాలతో ఓరగా చూసింది. నేను

'ఏమైనాసరే కోస్తా'ననే చూపుతో ఆ రెమ్మ నందుకొని మళ్లీ ఆ అమ్మాయి దగ్గఱకు ఆ పూవును చేర్చబోయేటప్పటికి ఆ అమ్మాయి కాళ్ళ మునివేళ్ళమీద నిలబడి ఒకచేయి బాగా పైకెత్తి ఆ పుష్పాన్ని అందుకోబోయింది. నేను కొద్దిగా పాదాలను లేపి ఆ పుష్పాన్ని ఆమెకు అందీ అందకుండా వుండే స్థానంలో వుంచి ఆమె పుష్పాపచయవిలాసం చూచి తనివితీరక అల్లాగే వున్నాను. ఆ అమ్మాయి నావంక చురుక్కున చూసి మరొక చెట్టువైపుకు సాగిపోయింది. నేనా పూవును తుంచి ఆ అమ్మాయిని మాట్లాడించకుండా పూలసజ్జలో వేశాను.

ఆ పక్కనే వున్న జంట మల్లెను ఇద్దరమూ ఒకేసారి సమీపించాము. ఆమె ఒక మల్లె పూవును చూసి వెంటనే నన్ను చూసి కళ్ళల్లోనే నవ్వువెన్నెలల దాచుకొని పూలు కోయసాగింది.

"సికిలి సికిలీ పూల
సిత్రాల మళుపులో
జంటమల్లెను సూసి
మెంటనే నను సూసి
కళ్ళల్లొ నవ్వింది నా రాణీ
ఎన్నెల్లు ఒలికింది నా రాణీ

అన్నాడు ఒకకవి. ఎంత మధురమైన భావం'' అన్నా నేను.

ఆ అమ్మాయి తొందరగా పూలు కోసింది.

'అమ్మాయీ - నీకు నేను భర్తనేనా' అన్నా.

'నాకే స్వాతంత్ర్యం వుంటే.'

అంటూ చరచరా నూతిదగ్గరకు నడిచింది.

నేను కలిసి వెడితే బాగుండదని కాసే పక్కడే వుండి ఏదో ఒక గడ్డిపూవును తుంచి నెమ్మదిగా వెళ్ళాను. ఆ అమ్మాయి నీళ్లు చేదతో తోడింది. అప్పుడే నేను దగ్గరకు వెళ్లాను. ఆ అమ్మాయి చేయి అడ్డం పెట్టుకుని దాహం సగం తీర్చుకుంది.

ఇంతలో నే వెళ్ళి "నాకు కూడా దాహం అవుతోంది - మంచినీళ్ళు పోస్తావా, అమ్మాయి!" అన్నా.

ఆ అమ్మాయి మంచితీర్థంపోయడానికి చేద ఎత్తబోతూ నాలుగుపక్కలా చూసింది. ఇంతలో ఎవరో పురుషుడప్పుడే ఆ నూతికేసి వస్తున్నాడు. తానుకూడా పూర్తిగా దాహం తీర్చుకోకుండానే, పాదాలపై నీళ్లు కుమ్మరించి పూలసజ్జతో ఇంటికి వెళ్లింది ఆ లలితాకృతి.

* * *

ఆ అమ్మాయి పల్లవాంగుళులతో కాని తీరని దాహం నిలచే వుండిపోయింది నాలో.

* *

తర్వాత... వాకబు చేస్తే...ఆ అమ్మాయి కయిష్టంగా ఏ గుమాస్తాకో ముడిపెట్టారని తెలిసింది.

* * *

ఆ దాహమే నన్ను బైరాగిని చేసింది అని కన్నీరు నించాడు బైరాగి.

*

శ్యామలరావు "కాస్త అన్నం తీసుకొచ్చి పడెయ్యవే ఆ అబ్బాయికి పాపం" అని లోపలకు కేక వేశాడు.

అప్పుడే మధ్యాహ్నం ఫలహారానికి కూడా పిండి రుబ్బి నడవలోకి వస్తున్న లలిత కా కేక వినబడి వెనక్కి వెళ్ళి అన్నం తీసుకొచ్చింది.

ఆ బైరాగి ఆమెవంక చూడకుండానే నాల్గుకొంగులూ సరిగా పట్టుతున్నాడు. లలిత అన్నం పడవేయబోతూ వుంటే తల పైకెత్తి హఠాత్తుగా కళ్ళల్లే బిగుసుకుపోయి 'లలితా' అని కేక వేశాడు.

*        *        *

లలిత ఆ కంఠస్వరం గుర్తుపట్టి 'మోహనా' అంటూ తనకు తెలియకుండానే విస్తరి జార్చి కొయ్యబారింది.

*        *

శ్యామలరావు నిర్విణ్ణుడై కదలలేదు.

*




# పూర్ణం

ఏదో చెప్పలేనంత ఉత్సాహం, దానంతట అదే వచ్చిన గంభీరత అతనిని ఆశ్రయించినయి.

'తెలిసిందిలేవోయ్ పూర్ణం' అన్నారు మిత్రులు పరిహాసంగా.

మురిసిపోయారు తల్లిదండ్రులు, కోడలికడుపు అచిరకాలంలోనే ఫలిస్తుందని.

అసలే ఎత్తుబారీ కుటుంబం, అందులో శుభసూచకం.

చుట్టాలు రోజు కొక్కరుగా సూడిదలు పట్టుకొచ్చారు. వచ్చిన బంధువుల్ని పరామర్శ చేయడంలో తండ్రికి, నౌకర్లకు ఎడతెరిపి లేకుండా పనులను పురమాయించడంలో పూర్ణానికి ఒక్క గడియకూడా ఊపిరి సలపడంలేదు.

నిత్యకల్యాణం పచ్చతోరణం - రోజూ విందులే.

పుట్టింటివారు ఘనంగా ఇచ్చారు సూడిదలు, ఏడవ మాసంలో వెంకటలక్ష్మి పుట్టింటి కెళ్ళింది.

* * *

పూర్ణానికి ఊహలమీద ఊహలు - పుట్టేది పిల్లయితే చిన్నతనంగా ఉంటుంది. ఆ! ఆడపిల్లట! అని ఇరుగూపొరుగూ పెదవి విరుస్తారు. మగపిల్లవాడయితే, అది ఒక ఠీవి, ప్రతి సీలాటి రేవులోనూ ఫలానా అని చెప్పుకుంటారు, అందులో తొలిగా అయితే.

నవ్వుతారు కొందరు. పందొమ్మిదోయేట బిడ్డలతండ్రి అయ్యా డంటారు. పిల్లవాడిచేత నాన్న అని అనిపించాలని ప్రయత్నం చేస్తారు. వరసవాళ్ళు కోడిగాలు ఆడతారు.

అయితే ఏం? పిల్లవా డందంగా వుంటే, చక్కగా బంతిపువ్వల్లే ఉంటే?

ఎవరిపోలికగా ఉంటాడో, ఈ విషయంలో మాలో మాకు చిన్నపిల్లసమేరీ ఉంటుంది.

అయినా పిల్లవాడు నా పోలికగానే ఉంటాడు: పిల్లవాడికి తండ్రిపోలికలు, పిల్లకి తల్లిపోలికలు ఇది స్వభావం.

* * *

ఒక సాయంత్రం శుభవర్తమానం తీసుకువచ్చాడు, శోభాపురంనుంచి. పిల్లవాడేనట! పూర్ణం తల్లిదండ్రులు అందలం ఎక్కారు. పైమీాద నున్న పాతిక రూపాయల కండువా బహుమతి వచ్చినవాడికి. పూర్ణం తండ్రిని ఒకటే మెచ్చుకోడం వాడు.

పూర్ణానికి తల్లీతండ్రీ ఒక్కమాటే చెప్పారు గదిలోకి వెళ్ళి—

“ఏమిటమ్మా పిన్నీ” అంది పక్కింటావిడ. అంతే! ఊరంతా ఉప్పందిపోయింది.

సముద్రుడులాగ ఏసంగతీ లోపల ఇముడ్చుకోలేరు కొందరు.

పక్కఇంటికి పనివున్నా లేకపోయినా “కాస్త నిప్పుంటే పెడుదూ” అని వెళ్ళి “వదినా విన్నావా, ఫలానావారి కోడలికి

పురుడొచ్చిందిట! మగపిల్లవాడట. ఇంచక్కగా వుంటాడని'' కొందరు.

"అయ్యో, ఇదేమిటమ్మా పురిటితో ఊరగాయిజాడీలు ముట్టుకున్నావు'' అని పనిగట్టుకొని వెళ్ళి చెప్పేవారు కొందరూ.

చెరువుకి బట్టలుతకడానికి వెళ్తూ ఖాళీబిందెలతో వచ్చి, "అత్తా, నువ్వు చెప్పకపోయినా తెలిసిందిలే, మగపిల్లవాడటగా! బాగానే వుంది. అయితే భారసాల ఎప్పుడూ?''

"ఎప్పుడో అప్పుడు. భారసాలకేమొచ్చె, చెంబెడు నీళ్లా సలక్షణంగా పోసుకుంటే అంతేచాలు. అయితే అప్పా, బావపేరేనా?'' అని మరొక ఆవిడ అందుకొని అంటూంటే—

"ఏసరు మసిలిపోతోంది - విన్నా పెద్దమ్మా, మనమడటగా, మధ్యాహ్నం వస్తా'' అని మడినీళ్ళబిందెతో ఇంటికి వెడుతూ గుమ్మంలోనుంచే కేక వేసింది ఇంకొకావిడ.

"పూర్ణఏడీ? బైటికిరావడంలేదేం? కొంటెతనంగా ఇంట్లో దూరేడూ, (గదిలోకి వెళ్ళి)'ఒరే పూర్ణా! అమ్మ అమ్మ అమ్మ అల్లరన్న అల్లరా నీదీ. నడుం వొంగుతుందిలే, మీ అబ్బాయితో చెప్పి నీ బుగ్గలు ఇల్లా సాగతీయిస్తా'' అంటూ బుగ్గలు పట్టుకుంది ఒక వృద్ధవితంతువు.

"నీ ఇష్టం వచ్చిన బట్టలు కొనుక్కో— అబ్బాయి, పిల్లవాడికి వొత్తులూ అవీ చేయించు, మంచి చీరేదైనా పుచ్చుకో నాయనా! ఏలూరు వెళ్ళి'' అన్నాడు పూర్ణం తండ్రి.

నెలలోపల భారసాల. సబంధుకంగా పూర్ణం బయలు

దేరాడు. వెంకటలక్ష్మికూడా ఏకైక పుత్రిక. శోభాపురంలో ఆడా మగా అందరు భోజనాలికి. భారసాలపెళ్ళికొడుకుకోసం ఎదురు చూస్తున్నాడు.

తెరతీశారు. సిగ్గుతెరలోనుంచి చూడనట్టుగా - తనప్రతి బింబం, అచ్చంగా తన ప్రతిబింబం-చూశాడు పూర్ణం.

అంతా కొత్తగా వుంది. అంతమందిలో, పీటలమీద తానూ తన వెంకటలక్ష్మి (అంతవరకూ పరిపాటే); ఏ మహాకవో అనే లక్షణాలుండి, పొత్తిళ్ళలో, బాహ్యప్రపంచాన్ని విస్మరించి ఏకాగ్రాలోచన చేస్తూ, అర్ధనిమీలిత నేత్రుడైన కుమారుడు. చాలు, ధన్యత అనుకున్నాడు.

అందులో, జనాంతికం.

“అయ్యో, వరహీనం వరహీనం అనుకున్నామే. రెండేళ్ళేగా! చెట్టంత మనిషయ్యాడు, చూశావా! వెంకటలక్ష్మి మొగుడు? చెబుతా! నేను ఆనవాలే పట్టలేకపోయాను. చాటంత వెన్నుపట్టు అతనూ” అంది బుగ్గమీద వేలేసుకుని ఒక పూర్వసువాసిని.

“చాల్లే ఊరుకో. ఎవరేనా వింటే బాగుండదు. ఏమనుకుంటారు? నరుడి దృష్టికి నల్లరాళ్లు పగులుతాయిట” అంది ఒక చంటిపిల్లతల్లి ఆవిణ్ణి మందలిస్తూ.

“బావుందమ్మా, బావుంది. ఇది మరీ బావుంది. నేను మాత్రం ఏమన్నా నేమిటి?” అంటూ గాలిపటమల్లే ఇంకో చోటికెళ్ళింది, నూతనంగా కాపరానికి వచ్చినపిల్ల మెడలో

గొలుసు మెలికలు తీస్తూ, 'ఈ గొలుసు మీ పుట్టింటివారు చేయించిందేనా' అని అడగడానికే కాబోలు.

ఆ సాయంత్రం ఎవరో "ఇదుగోనయ్యా నీ కొడుకు. ఓహో! ఏమందంగా ఉన్నాడు ! పోలిక లెక్కడికిపోతాయి?" అంటూ పిల్లవాణ్ణి తీసుకొచ్చి ఇవ్వబోతే సిగ్గుతో "నాన్న చేతి కియ్యి, అమ్మాయి! నే చూశాలే" అంటూ తండ్రిచేతి కిప్పించాడు పూర్ణం.

మరురోజు ప్రయాణం స్వంతఊరికి. అందరూ ముందర బయలుదేరారు. ఇంట్లో అందరితో వెళ్లివస్తానని చెప్పి పూర్ణం గుమ్మందాకా నడిచాడు.

మళ్ళీ వెనక్కి వచ్చి గదిలో తనమూర్తిని మళ్ళీ ఓమాటు చూశాడు, చేతుల్లోకి తీసుకొని. ఇతర్లెవరూ లేకుండా చూసి ముద్దుపెట్టుకున్నాడు. ఒక అవ్యక్తమైన ఆనందానుభవం. (అంతకుముందు ముద్దుపెట్టుకోవడానికి ముహూర్తం దొరకనే లేదు) ఎవ్వరూ లేకుండా చూసి మళ్లీమళ్ళీ ముద్దుపెట్టుకున్నాడు.

"ఏం-అంత ముద్దువస్తున్నాడు పాపం!" అనే వెంకటలక్ష్మి పరిహాసంతో మనస్సు వెనక్కి, కాళ్లు ముందరకూగా పూర్ణం బయలుదేరి తల్లిదండ్రుల్ని కలుసుకున్నాడు.

* * *

"అదుగోనయ్యా - మీ అబ్బాయి వస్తున్నాడు" అంటూ పూర్ణంతో కోడిగాలు.

ఏ మాత్రమూ నమ్మనట్లు నిర్లిప్తతను ప్రకటించే పూర్ణం చూపులు.

'కాని వస్తున్నారేమో, వస్తే బావుండును' అని లోపల ఉద్దేశ్యం.

జబ్బుగా ఉందని ఉత్తరం వ్రాస్తే బయలుదేరి వస్తున్నారని ఆశ.

ఒకరోజున దిగాడు పూర్ణం మామగారు. మామగారి వెనక ఇంకా ఎవరైనా ఉన్నారేమో అని ఆశతో చూశాడు పూర్ణం. ఎవ్వరూ లేరు. దమ్మిడీకానంత మొగమైంది. కను గొనల్లోనే ఎవరికి తెలియకుండా ఇంకజేశాడు బట్టతో కన్నీటి బొట్లను.

'ఎల్లా ఉంది వంట్లో' అన్నాడు పూర్ణం మామగారు.

"గుండెనంజన్నారు వైద్యులు. ఇప్పు డోక మాదిరిగా ఉంది" అన్నాడు పూర్ణం.

"బావగారూ! దశమినాడు బావుంది. కోడల్ని కుఱ్ఱ వాడినీ తీసుకురండి. చూశారుకదా పూర్ణం వంట్లో సుస్తీ!" అన్నాడు పూర్ణం తండ్రి.

"కొద్దిగా నెమ్మదిగానే ఉందికదా! సరే, దశమినాడు తీసుకువస్తాను. దూరాభారం. మీ వుత్తరం అందిన తరువాత, మంచిరోజు దొరకలేదు" అన్నాడు పూర్ణం మామగారు.

అయిదోనెలలో శోభాపురం నుంచి పిల్లవాణ్ణెత్తుకుని దశమినాడు బయలుదేరింది వెంకటలక్ష్మి.

భర్తని చూడాలన్న వుత్సాహం, వంట్లో ఎల్లా వుందో అన్న ఆదుర్దా, నెమ్మదిగానే ఉందని తెలిసిందికదా అని మళ్లీ హృదయానికి నచ్చచెప్పుకున్న ధైర్యం.

బండి బయలుదేరింది. సందుమలుపు తిరిగింది. అంత వరకూ ఎవ్వరూ ఎదురుగా రాలేదు. తరవాత ఒక వితంతువు మాత్రం.

అయితే ఈ మాత్రానికి పట్టింపు దేనికి? దారి వెంబడి ఎంతమంది తిరుగరు కనక.

బండి ఇందుపల్లిదాకా వెళ్ళింది. తరువాత రైలుప్రయాణము. బెజవాడ స్టేషను వచ్చింది. రైలు భయంకరంగా కూత వేసింది. ఏలూరు స్టేషనులో దిగారు. మళ్ళీ బండి చేసుకుని బయల్దేరారు.

ఇసుక ఊరు. బండి నెమ్మదిగా ఊళ్ళోనే నడుస్తోంది. ఊరు చివర ఇల్లు. అస్తమయం పూర్ణంగా అయింది. బండి ఇంటికేసి వచ్చేస్తోంది. సందెకసువు చిమ్మడానికి ఒకావిడ బయటికి వచ్చింది. వెంకటలక్ష్మిని చూసింది. ఆవిడకీ వెంకటలక్ష్మికీ అపరిమితమైన స్నేహం.

"ఎప్పుడు వచ్చినా పలకరించేది. కొడుకు నెత్తుకువస్తే అంత చూడ్డానికే యిష్టం లేనట్టు లోపలికి వెళ్ళిపోయిందేం ఆవిడ?" — ఆశ్చర్యం కలిగించింది వెంకటలక్ష్మికి.

ఆవిడే కాదు; అందరూ అల్లా తెల్లపోతా రెందుకు తన్ను జూసి?

బండి సరాసరి వాకిట్లో ఆగింది. త్వరత్వరగా మండువాలోకి వెళ్ళింది. కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళు లేవు. తన భర్త అరుగుమీద కూర్చోవడం మామూలే! "అత్తయ్యా! వా రేరీ?" అంటూ గదిలోకి వెళ్ళి చూసింది.

ఎవ్వరో తన చేతిలోంచి బిడ్డను బలవంతంగా లాక్కొని వెంకటలక్ష్మి మామగారి చేతి కిచ్చారు.

పూర్ణం తల్లి ఒక్కపరుగున వెళ్ళి కోడల్ని కౌగిలించుకొని, 'ఈ వేళటికి అయిందే అమ్మా' అంటూ గొల్లుమంది.

వెంకటలక్ష్మి కౌగిలిలోంచి మొదలు నరికిన వృక్షం మోస్తరుగా విరుచుకు పడింది.

నెమ్మదిగా ఒక్కరొక్కరే ఇరుగూపొరుగూ వచ్చారు. ముక్కుమీద వేలేసుకున్నారు. "పసుపు, కుంకుమా ఎంతకొత్తగా వున్నాయి. ఆ ముఖంలో వైధవ్యం వున్నట్లే కనుపించడంలేదు. భగవంతుడికి కన్ను కుట్టింది" అని అన్నారు.

"నాన్న చేతి కియ్యి, నే చూశాలే" అన్నాడు అబ్బాయి. ఇల్లా జరగవలసి వుంది కాబోలు" అని ఆవురుమన్నాడు, పూర్ణంతండ్రి.

కొంతసేపటికి వెంకటలక్ష్మికి తెలివి వచ్చింది కాని ఏం లాభం? కళ్ళు మూసినా తెరచినా ఒక్కటే అంధకారం.

మళ్ళీ జనాంతికం "బంగారునాయన పుట్టాడు. ఏ గడియను పుట్టాడో—తండ్రిని పొట్టని పెట్టుకున్నాడు" అంది పసిపిల్లవాణ్ణి వుద్దేశించి మరొక బహుసంతానవతి.

పూర్ణం తండ్రిదగ్గరికి ఒక ముదివగ్గు వెళ్లి 'ఊరుకో నాయనా! ఊరుకో- భగవంతుడు ఈ బొమ్మని ఇల్లా చూపించి- ఆ బొమ్మని అల్లా లాగేశాడు.

బతు కంతా ఒకనాటకం,

అంధకారంలోనే వెలుగుంది."

అన్నాడు.

# లోకువ

ఎంత సేపటినుంచి అల్లా బాదుతున్నాడో తెలియదు కాని, ఒక్కమాటుగా గుండెల్లో 'ఢణా' మని గుద్దినట్లుగా తలుపు చప్పుడు వినిపించింది. 'ఎవరు వా'రని కేక వేసి వెంటనే ఇంకా ఎంతరాత్రి వుందోనని గడియారంవంక చూశాను. అప్పుడే గడియారం మూడుగంటలు కొట్టింది. వీధి తలుపు మాత్రిం బందిపోటు దెబ్బగా అదిరిపోతోంది. కళ్లు నులుముకుంటూ ఎంతో చిరాకుగా, వచ్చిన మనిషికి గట్టిగా బుద్ధిచెప్పిపంపిద్దాం- ఎప్పుడూ అల్లా చెయ్యకుండా- అన్నంత కోపముతో ఒక్క- మారుగా తలుపు రెండురెక్కలూ భార్లగా తీశాను. "కొంప కూలిందండీ శాస్త్రుల్లుగారూ!" అంటూ సోమయ్యగారు నన్ను కావిలించుకుని ఏడవడం మొదలుపెట్టాడు. నా కంతా ఆశ్చ ర్యంగా వుంది. 'ఏమిటీ-ఏదైనా దొంగతనమా? నిదానించండి, ఏమిటీ ఆ ఆయాసం' అన్నా నా కేం అర్థముకాక. "అర్థం కాదు, ప్రాణమేనండో...శాస్త్రుల్లుగారూ" అంటూ బిగ్గరగా ఏడవడం మొదలుపెట్టాడు. 'ఏమిటండీ? ఏమిటండీ' అని వెంట బడి అడిగినా చెప్పడే. చివరకు "ఇదిగోనండీ- చూడండి" అంటూ ఒక వుత్తరం ఇచ్చాడు నాకు. 'మీరు కాసేపు నిదా నించండి' అంటూ వీధి తలుపు గడియ వేసి ఆయన్ని కూడా హాల్లోకి తీసుకు వచ్చాను. ఆ వుత్తరం ఎంతో వణుకుతూ వ్రాసిన అక్షరాలతో ఇల్లా వుంది.

## చరమ లేఖ

"ప్రియమైన భర్తగారికి—

కడసారి నమస్కారాలు మీకూ నాకూ ఇన్నాళ్ళూ జరిగిపోయింది. గడచింది స్వల్పం. శేషం విశేషం.

మీ చేత అనుమానింపబడ్డ నేను మీదగ్గర వుంటే మీకుమాత్రం ఏం సుఖం? ఆ అభిప్రాయం కలిగినంతవరకే గాని కలిగినతరువాత సంసారం పొత్తుపడుతుందా?

అందుచేత...అనలేకుండా వున్నాను—ఆ మాట... పోతాను......

నాకోసం మీరు బావులు చెఱువులు వెదకించడం కాని, ఇతర విషయకమైన ఆచోకి తీసే ప్రయత్నాలు కాని నిష్ప్రయోజనం.

మీ నగలు యావత్తూ-ఇనప్పెట్టెలో, మూడో అరలో పెట్టాను......తాళంచెవ్వి మామూలు చోటనే వుంది.

ఆ రెండేళ్ళ పిల్లవాడు బ్రతికి బట్టకట్టే అదృష్టముంటే, మన శంభుశాస్త్రుల్లుగారి చేతనే చదువు చెప్పిస్తే, నేను ఏ లోకంలో వున్నా సంతోషిస్తూ వుంటాను. మీరు నావిషయం మాత్రం మరచిపోండి."

సోమయ్యగారి కండువా తడిసి ముద్దయింది. ఆవుత్తరం ఆయన కిచ్చేశాను. "అన్యాయంగా పొరపాటు పడ్డానండీ శాస్త్రుల్లుగారూ - బహుయోగ్యురాలండీ - ఎంతో తెలివి

కలదండీ—స్త్రీహత్యా పాతకం మూట కట్టుకున్నానండీ''
అంటూ మళ్ళీ ఏడవడం మొదలుపెట్టాడు పాపం ఆయన.

నిజానికి ఆ అమ్మాయి మంచి అందకత్తె. చురుకైనది కూడాను. ఆవిడకు నేనంటే ఎంతో గౌరవమూ, భక్తి. "అన్నయ్యగారూ" అంటూ పిలుస్తూ వుండేది నన్ను. ఆ అమ్మాయి ముఖంలో ఒక కృత్రిమపు రేఖకూడా కనిపించేది కాదు. కాని మళ్ళీ ఇంటికి రాగానే ప్రక్కనే గుసగుసలు.

కాని ఎందుచేతో ఆ అమ్మాయి పోయిందంటే నమ్మకం కుదరడం లేదు. ఆవి దేమిటీ, పోవడ మేమిటీ?—కాకపోతే యీ వుత్తరం.........

'అసలు జరిగిన కథేమిటండీ' అని అడుగుదా మనిపించింది సోమయ్యగారిని. పాపం ఆయన దుఃఖం ఆపుకోలేక వుత్తరం చూపించాడు. మొత్తంమీద వాళ్ళిద్దరిమధ్య ఏదైనా కొంత గ్రంథం జరిగి వుండవచ్చు ననుకొని సోమయ్యగారూ - ఇంతకూ ఇట్లా జరగవలసివుంది—జరిగింది. పాపం మీ రేం చేస్తారు! ఈ వుత్తరం చదివిన తర్వాతయినా ఆవిడ చచ్చిపోయినట్లు నాకు నమ్మకం కలగడంలేదు. పుట్టింటికి వెళ్ళి వుండవచ్చు. ఆ విషయం కాస్త దర్యాప్తు చేయించండి' అన్నా.

సోమయ్యగారిని ఇంటిదాకా దిగపెట్టి వచ్చి పడీమంచం మీద కాస్త వెన్ను వాల్చా, ఇంకా పొద్దుందికదా అని-మళ్ళీ ఇదే ఆలోచన.

ఆడవాళ్లు ఎంతకైనా సాహసిస్తారు. మగవాడికి ఏ తెలివి తక్కువ చేతనైనా అనుమానం కలిగి స్తేమాత్రం—కొద్దిగా ఒత్తిడి చేస్తేమాత్రం.........పండంటి కాపరాన్ని వదలి, పండంటి కొడుకుని వదలి...జీవితానికే స్వస్తిచెబుతారా? అది ఏం తెలివిగలిగి చేసినపని? చచ్చి ఎవర్ని సాధిస్తుం దీ అమ్మాయి?

ఈ మొగవాళ్లు మాత్రం—అడ్డమైన దానికీ అనుమానపడడమే. కొంతమందిబతుకు పెళ్లాన్ని కళ్లతో గిరి గీయడంతోనే తెల్లవారుతుంది. పాపం! అమాయికలైన స్త్రీలు ఏం మాట్లాడినా వీళ్లు పెడర్థాలు తీస్తారు. తెల్లవా రి లేస్తే ఏదో పనిపెట్టుకుని ఆ కాస్తమాటా అని,చావా చితకా బాదే వారు కొందరూ- అసలు యేదో వున్నట్టూ తమ బుద్ధికౌశలం చేత అది తాము గ్రహించినట్లుగా ఆ మనిషి, అనగా పెళ్లాం గ్రహించా లని కొంద రూరికే తపిస్తూవుంటారు. ఏపాపం ఎరగని ఆడవాళ్లు కళ్ళల్లో నీళ్ళు నింపుతూ వుంటే ఆనందించే మగవాళ్ళు కొందరూ, 'ఆడవాళ్ళకు టక్కులు తక్కువా' అని పాపం వాళ్ళు ఏడుస్తున్నా ఇంకా క్షోభపెట్టేవాళ్లు కొందరూ. నిజంగా ఏపాపం ఎరగని వాళ్ళకి ఒకప్పుడు వీళ్ళమాటలేదైనా నేర్పవచ్చుకూడా. కాస్త సున్నితమైన మనస్సుకలవాళ్ళుంటే ఆ మాటలే వాళ్ళ ప్రాణాల్ని తీ స్తయి. తొందరపడి అన్న వాళ్ళు తర్వాత విచారి స్తేమాత్రం ఏం ప్రయోజనం?

ఆ అమ్మాయిని గురించయినా యీ వాదు పుట్టింది ఇరవై రోజులనుంచే, దానికి చిలవలు పలవలు—ఎంత సేపు!

ఆవిడ - పాపం - వుత్తరంలో తన కొడుక్కి నా చేతనే చదువు చెప్పించాలంది...పిచ్చితల్లికి నా మీద ఎంత గౌరవం! అయితే ......... ఆవిడలేఖలో తన రహస్యం బైటపడిన తర్వాత ఇంక నిష్ప్రయోజన మనీ, అందుచేత తాను మరొక చోటుకు లేచి పోతున్నానని కూడా అర్థం వస్తుందే మరొక దృష్టితో చదివితే. అర్థాలు తీయదలచుకుంటే ఎల్లాగైనా వస్తయి. ఆవిడ జీవించివుండీ అని అనుకుంటే ఆవిడ శీలాన్ని శంకించా సన్నమాట. ఎందుకు వృథాగా మనస్సుతోనైనా పాపం చేయడం.

* * * *

తర్వాత ఇరవై యేళ్ళమాట - 'వసంత ఫిలిమ్సు' వారి కార్యసందర్భములో, నేను కలకత్తాలో వుంటున్న రోజులవి.

ఒకరోజున నేను మామూలుగానే స్టుడియోనుంచి చిన్నకారులో ఇంటికి వస్తున్నాను. హఠాత్తుగా నా చూపులూ మావీధి మొదటి మేడవరండాలో నిలబడిన ఆవిడ చూపులూ ఒక్కసారిగా కలుసుకున్నయ్. నాకు చాలా చిత్రంగా వుంది. కారు సాగినా నేను ఏదో ఆలోచనతో వెనక్కినక్కి తిరిగి చూశాను. అవిడ వరండా వదలి అరుగుమీదకు వచ్చి నాకేసే చూడడం మొదలుపెట్టింది. నాకు ఆశ్చర్యం కలిగింది. ఆ సాయంత్రం షికారుకు వెడుతూ ఎవ్వరా ఇంత పరిచితంగా చూస్తున్నారని నేను ఆ వీధినే తాపీగా నడిచి వెళ్లాను. ఆవిడ మళ్లీ అదేవిధంగా నాకేసి అదేపనిగా చూడడం మొదలు పెట్టింది. నాకూ ఏదో జ్ఞప్తికి వచ్చినట్లుందికాని ఇద మిత

మని నిర్ణయించ లేకుండా వున్నాను. తెలియని చూపులు చూస్తూ సాగి నడిచాను. పొద్దు బాగా పోయినతర్వాత నేను యింటికి తిరిగి వచ్చేటప్పటికి నా కోసం ఎవరో ఒక కుర్రవాడు నిరీక్షిస్తున్నాడు. నన్ను ఆ నంబరు గల యింటి యజమానురాలు రమ్మన్న దన్న కబురు. నాకు పూర్తిగా ఆశ్చర్యం కలిగింది. రేపు పొద్దున్న వస్తా నని కబురుచేశాను.

మరురోజు ప్రొద్దున్న సరాసరి వారింటి కెళ్లాను. నన్ను చూసి ఆవిడ గిరుక్కున లోపలికి వెళ్ళిపోయింది. వెంటనే ఒక నౌకరు వచ్చి అమ్మగారు మిమ్మల్ని వరండాలో ఒక కుర్చీలో కూర్చోమన్నారంటూ నాకు కుర్చీ చూపించాడు. నేను ఉపవిష్టుణ్ణయిన వెంటనే తెరచాటునుంచి ఒక స్వరం ఇల్లా వినబడింది.

"మీ దేవూరో సెలవిస్తారూ?"

"మాది వసంతపురం" అన్నా వెంటనే ...... స్వరం ఎక్కడో విన్నట్టుగా వుంది.

"ఇల్లెక్కడో కూడా సెలవిస్తారూ?"

"బ్లాకిపేటలో వీరవల్లివారి సందులో" అన్నా.

"వసంతపురంలో - వారు - ఆ వీరవల్లివారి సందులో మొదటిల్లు - పెద్దమేడ......వారి పేరేమిటి...వారు బాగా వున్నారా?" అంటూ యేమిటో తికమకపడుతూ అడిగింది.

"సోమయ్యగారా... ...వారు కాలంచేశారు. చాలా యోగ్యుడు పాపం! ఆయన భార్యావియోగం సహించలేక పోయాడు. వారిని మీ రెల్లా యెరుగుదురు?" అన్నా.

"ఎరుక వుండేదిలెండి - అయితే పాపం! ఆయన కేదో పిల్లవాడున్నా డేమో'' అంది ఆవిడ. ఈ తడవ కంఠం బాగా రుద్ధమయింది. ఆదుర్దా మాటల్లో కాకపోయినా ఉచ్చారణలో స్పష్టంగా కనిపిస్తోంది.

"అతను కులాసాగానే వున్నాడు. ఆయన కాలంచేసే టప్పుడు నేనే దగ్గర వున్నాను. ఆ కుర్రాడి మైనారిటీ వెళ్ళేవరకూ విద్యాబుద్ధులు చెప్పి ఆ ఆస్తిని చూస్తూ వుండమన్నాడు. ఆకుర్ర వాడి ఆ ఆస్తిని ఆ కుర్రవాడికి అప్పచెప్పేను. పెళ్ళికూడా చేశాను. అక్కడే తహస్సీలుదారుగారి అమ్మాయి నిచ్చారు" అన్నా.

"ఆ కుర్రవాడి తల్లిసంగతి యేమన్నా తెలిసిందా?'' అంది ఆవిడ.

"తెలిసే దేముంది-పాపం? చచ్చిపోతానని వుత్తరం వ్రాసి చచ్చిపోయింది. అయితే ఆవిడ మీ కేమైనా అవుతుందా!'' అన్నా.

ఆ ప్రశ్న కేమీ సమాధానం చెప్పకుండా "మళ్ళీ ఒక మాటు సాయంత్రం కనిపిస్తారుకాదూ- నామీద దయ వుంచి?" అంది ఆవిడ.

నేను బయలుదేరి ఇంటికి వెళ్ళాను. ఇల్లు చేరిన గంటకు నా కొక కవరు పట్టుకువచ్చాడు నిన్నటి నౌకరే. అందులో ఇల్లా వుంది.

"శంభుశాస్త్రిగారూ - నమస్కారాలు. నన్ను మీరు గుర్తించకపోయినా మిమ్మల్ని నేను గుర్తించాను. నా ముఖం

మీకు చూపడానికి చెల్లకుండా వుంది. నా పాపానికి యేదైనా నిష్కృతి వుందో లేదో తెలియదుకాని - నా శీలం నేను పాడు చేసుకోవడమే కాకుండా, నేను యోగ్యురాల నని అనిపించు కొనడానికి ఒక వుత్తరం వ్రాసి నా భర్తగారి ప్రాణాలుకూడా పొట్టను పెట్టుకున్నాను. కొడుకును చేతులారా పెంచుకొనే యోగ్యతకూడా లేకపోయింది.

నేను వస్తుతః అంత ద్రోహురాలను కాను—ఇదంతా మా వంటమనిషి చేసింది. రోజుకో చిత్రం మాయింటికి తీసుకు వచ్చి చూపించేది. నిజంగా బొమ్మలు బాగుండేవి. ఆచిత్రాల్లో మావంటమనిషి బొమ్మకూడా వుంది. ఒక రోజున ఆ బొమ్మనే చూస్తూన్నాను నేను. ఇంతట్లో మా వంటమనిషి "మీ చిత్రంకూడా వేస్తా డతను. చాలా బాగుంటుం" దంది. నా కేమీ అక్కరలే దన్నాను. ఆ మరుగోజునే ఆ చిత్రి కారుడు తనకు కావలసిన వా డంటూ వెంటపెట్టుకు వచ్చింది. నేను లోపలకు వెళ్ళి ఆవిడ తీసికొనివచ్చిన చిత్రా లన్నీ ఆవిడ కిచ్చి ఆయన కిచ్చివేయ మని చెప్పాను. ఆవిడ ఇచ్చివేసింది. మరి ఎందుచేతనో అతన్ని చూస్తే గౌరవంకంటె భయమే ఎక్కువ వేసింది. మరికొన్ని రోజులకు నా చిత్రాన్ని త్రివర్ణయుతంగా తయారు చేయించుకుని తీసుకువచ్చిం దావిడ. ఆవిడను చూసేటప్పటికి నాకు కోపం వచ్చింది. కాని చిత్రం బాగా వుంది. 'పరాయి మొగవాడు నా చిత్రాన్ని వ్రాయ డమా!" అనే శంక నా హృదయాన్ని గాఢంగా బాధించింది. ఆ బొమ్మను త్రిప్పివేద్దామా అని అనుకున్నాను. నా బొమ్మ

అతనిదగ్గర దేనికి ? అని అనుకుంటూ 'ఎందుకు వ్రాసినట్టు యీ చిత్రం'? అన్నాను మా వంటమనిషితో. 'మీకు బహూకరించటానికి' అంది. 'ఏమిటీ, నాకు బహూకరించడమా—యెంత తప్పయిన విషయం - రేపు ఆయన/యేమిటిది - అంటే యేమని సమాధానం చెబుతాను! నా చిత్రాన్ని పరాయి మొగవాడు వ్రాసి నాకు బహూకరించాడూ అంటే యెంత సంశయించాలిసిన విషయం' అని మనస్సులో అనుకున్నాను. ఆ చిత్రాన్ని చింపివేయా లనుకున్నాను కాని చింపివేయలేక పోయాను. నా హృదయం యేదో మోసం చేసినట్టుగా కొట్టుకుంది. దాన్ని యెవరూ చూడని ప్రదేశంలో భద్రంగా దాచాను. ఆ చిత్రానికయిన ఖర్చు తీసుకువెళ్లమని ఆవిడతో అంటే 'అతను తీసుకోనన్నా' డని జవాబు. చిత్రాన్ని నే కోరకుండా పరాయి మొగవాడు వ్రాయడం — మూల్యం తీసికోకపోవడం — అనే విషయాలు నా మనస్సును బాగా మెలివేశాయి.

తర్వాత ఒకరోజున నా భర్తగారి నడిగే నేను వంటమనిషిని తీసుకొని, సినిమాకు వెళ్లాను. హాలుదగ్గర నాకా చిత్రకారుడు కనిపించాడు. మా వంటమనిషి చాలా చనువుగా అతనితో మాట్లాడింది. పైగా నావంక చూసి 'మీ చిత్రం వ్రాసింది వీరే అంటూ' అంతకు పూర్వం నే నెరగనట్లు మాట్లాడింది. నాకు ఏమనాలో తెలియలేదు. కాని అతను యేదో సమాధానాన్ని నిరీక్షిస్తున్నట్లుగా నుంచున్నాడు. 'అల్లాగా' అన్నాను, అసహ్యం, సిగ్గూ లోలోపల అణచు

కుంటూ, ఆరోజున సినీమా చూసిన తర్వాత కూడా మేము జట్కా ఎక్కి వెళుతుంటే 'వెళ్లివస్తా'నని నాతోనూ మావంట మనిషితోనూ చెప్పివెళ్లాడు.

ఒక రోజున మా వంటమనిషి బలవంతంమీాద ఎగ్జిబిషను చూడడానికి వెళ్ళాను. అక్కడ అనేక చిత్రాలు అలంకరించబడ్డాయి. హఠాత్తుగా ఒకటి నాదృష్టి నాకర్షించింది. నేను వెంటనే మా వంట మనిషివంక చూశాను. ఆవిడా నన్ను చూస్తూనేవుంది. నా కెంతో సిగ్గేసింది. ఎగ్జిబిషనుకు వచ్చిన వాళ్ళంతా ఆ బొమ్మవంక చూడడం, వెంటనే నావంక చూడడం. ఆ బొమ్మలో చిత్రకారుని పోలికలు గల ఒకడు నన్ను చుంబిస్తున్నట్లుగా వ్రాయబడివుంది. నేను వెంటనే బయటకు వచ్చి ఆ వంటమనిషిని దాని విలువయిచ్చి ఆ చిత్రాన్ని కొనుక్కురమ్మనాను. ఆవిడ కొనుక్కొచ్చింది. నేను దాన్ని ఇంటికి తీసుకువచ్చి పరాపరా చింపి నీళ్ళకాగుకిృింద మంట పెట్టాను. ఆవిడను నౌకరీలోంచి తొలగిస్తానని గట్టిగా మందలించాను.

ఆవిడ అతనితో యేమిచెప్పిందో యేమిటో - ఆ మరురోజు అతను తయారయాడు మా యింటికి. ఇంట్లో యెవ్వరూ లేరు. వారు యెక్కడకో బయటకు వెళ్ళారు. ఇంట్లోకల్లా వచ్చేసి "నాది తప్పయితే క్షమించండి- బొమ్మలోనైనా నా కోరిక తీర్చుకోకూడదా'' అంటూ ప్రారంభించాడు. నాకు చాలా అసహ్యం వేసింది. ఏమిటి - పైగా సిగ్గులేక ఒక జిజ్ఞాసువు ప్రశ్నించినట్లుగా తాపీగా మాట్లాడుతాడేమా - అనిపించింది.

‘సిగ్గులేక మాట్లాడవచ్చావా! వెళ్ళువెళ్ళు’’ అన్నా.
“వచ్చినకోపం యెల్లాగూ వచ్చింది కాని ఆ కోరిక భావనాప్రపంచంలోనే వుండకుండా అనుభవంలో నిలుపుకుందామని వుంది’’ అంటూ తటాలున వచ్చి బలవంతంగా నా రెండు చెంపల్నీ గట్టిగా ముద్దుపెట్టుకున్నా డతను. నేను నా రెండు చేతులతో బలంగా అతని ముఖంమీద చరిచాను. వెంటనే అతను క్రిందబడిపోయాడు. నాకు కంపరం పుట్టింది. అతనికి ముక్కువెంట రక్తం కారడం ప్రారంభించింది. ‘వెళ్ళు వెళ్ళు, ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకుని’ అన్నా బింకంగా. అతను లేవలేదు. నాకు భయం వేసింది. అతని ప్రాణం కెల్లపోయిందేమో నని వెంట నే యీ పీడ వదిలిపోతే చాలన్నట్టు అతని ముఖంమీద రెండుచెంబుల నీళ్ళు కొట్టి ఆ నెత్తురు తుడిచి వేశాను. అతను మళ్ళీ హఠాత్తుగా లేచి నా జాలిని లోకువగా తీసుకుని నా చెక్కిలిని చుంబించి చుబుకం పుచ్చుకుని “మళ్ళీ వస్తాను. ఈ దీనుడికి ని న్ననుభవించవలె నని కాంక్ష కలిగింది. నీవు నన్ను చీల్పించి కాకులకు వేయించినా సరే’’ అంటూ న న్నదుముకుని వెంటనే వెళ్ళిపోయాడు. సాయంత్రం ఆ వంటమనిషి వచ్చింది. కాని ఆవిడ నేమంటాను? ఆవిడతో మాట్లాడడం తగ్గించాను. ఆయనతో చెబుదామంటే సిగ్గు! ఏమని చెబుతాను! చెప్పినా బాగుండేదేమో!

తర్వాత మరిరెండురోజులకు వచ్చి నాజాలిని లోకువగా తీసుకుని ప్రపంచంలో ఏ తప్పును - అందులో ముఖ్యంగా ఆడదానితప్పును - లోకం క్షమించదో ఆ తప్పును నాచేత

చేయించా డతను. కృత్రిమేపీ అది పీడలేని సంబంధ మయింది. ఒకరోజున నాభర్త అతడు మా యింటినుంచి బైటికి వెళ్ళడం చూచి నన్ను దండించారు. నేను బొంకాను. కాని వారు నమ్మలేదు. నేను వెంటనే అతనితో యీ విషయం చెప్పాను. అతడు నన్ను కలకత్తా తీసుకుపోయి నాకు దేవేంద్రభవనం కట్టిస్తానన్నాడు. నే నతన్ని నమ్మి పిల్లవాణ్ణిసైతం వదలి పుట్టింటి గౌరవానికి తిలోదకా లిచ్చి అతనితో ప్రయాణ మయ్యాను. ఆ లేఖలో గడుసుతనం భర్తృహత్యకూడా చేయించింది. ఆ చిత్రకారుడు కొన్నాళ్ళవరకూ బాగానే చూచాడు. తర్వాత కొంతస్నేహితులజట్టును ఇంటికి పోగుచేసి వాళ్ళకూ నాకూ ఏదో అకృత్రిమమైన సంబంధం అంటకట్టి మళ్ళీ ఉచ్ఛిష్టంలో స్వార్థపరత్వం చూపించి ఒకరోజున నాతో చెప్పకుండా లేచిపోయాడు. నాకు అతని మిత్రులతో మెలగడం తప్పనిసరై కేవలం గణికాగృహంగా ఆ యింటిని మార్చివేశాను. లేకపోతే నా భోజనం యింటిఅద్దె గడవడం కష్టమయింది. అనేక శ్రీమంతులు పాదాక్రాంతు లయారు నాకు. ఈ మేడా ఇప్పు డున్న లక్షరూపాయలూ ఇల్లా సంపాదించినవే. పాపానికి తగినశిక్ష యీ జన్మలోనే అనుభవించాను.

దయ వుంచి నా పిల్లవాణ్ణి ఒక్కసారి యిక్కడకు రప్పిస్తే సంతోషిస్తాను. రేపు ఒకమాటు తప్పకుండా వస్తారని ఆశ. ఈ భ్రష్టురాలియందు మీకు అసహ్యం కల్గవచ్చు కాని నన్ను పశుగణంలో లెక్కవేసిఅయినా జాలిపడవలె నని ప్రార్థన."

* *

ఈ వుత్తరం చదివేటప్పటికి నాకు మబ్బు విడినట్లయింది. వెంటనే ఆవిడ కుమారుడికి 'వైరు' చేశాను. అతను మూడవ రోజు మధ్యాహ్నానికి వచ్చాడు. ఆ సాయంత్రం అతన్ని కూడా వెంట పెట్టుకుని ఆ యింటికి వెళ్ళాను. ఆ కుర్రవాణ్ణి చూసి ఆవిడ ఒక్కుమారుగా వచ్చి కౌగిలించుకుంది. ఆ కుర్రవాడికి నేనేమీ చెప్పలేదు. అతడు తెల్లబోయి నావంక చూస్తూ ధైర్యం తెచ్చుకుని ఆవిడను ఒకనెట్టు నెట్టి "దూరంగా వుండు. ఎవరు నువ్వు?" అన్నాడు.

"మీ అమ్మరా, చంద్రం" అన్నా నేను.

"మా అమ్మ చిన్నప్పుడే చచ్చిపోయింది" అన్నాడు అతను.

"కాదు. అల్లా అని లోకం అనుకుంది. ఆవిడ బ్రదికే వుంది. పోలిక తెలియడం లేదా?" అన్నా.

"ఇక్కడ వుండవలసిన కారణం?" అన్నాడు.

"ప్రారబ్ధం" అన్నా నేను టూకీగా.

అర్థం చేసుకున్నాడు చంద్రం. "అనుభవించ మనండి" అన్నాడు, నెమ్మదిగాను నూటిగానూను.

"మాతృవిమర్శనం మహాపాపం. నోరు ముయ్" అన్నా నేను.

చంద్రం తక్షణం నిష్క్రమించాడు. మాతృహృదయావస్థని చూడలేక నేను నడిచాను.

# మణిమాలికా గ్రంథమాల

నేటికి వెలుగు చూచిన మణులు.

## పైడిపాటివారి రచనలు

౧. తూణీరం 8 అ.
గేయగుచ్ఛం
కవిత్వంపై చురుకు
విమర్శ

౨. దేశం (జాతీయ గీతములు)
దేశభక్తి ప్రబోధంతో
ఆంధ్రుల ఆదరాన్ని చూర
గొన్న గ్రంథం. 8 అ.

౩. నీలం (కథాసంపుటి) 8 అ.
సాంసారిక జీవితం ప్రతి
బింబించే విశిష్ట చిన్న
కథలు.

## అక్కపెద్ది సత్యనారాయణ గారి గ్రంథములు

౧. అమృతసిద్ధి 8 అ.
పద్య కావ్యము
మద్రాసు, ఆంధ్ర, విశ్వ
కళాపరిషత్తులచే ఇంటర్మీడి
యేటుకు పఠనీయముగ నిర్ణ
యింపబడిన మధుర కావ్యం.

౨. దాస్యవిముక్తి 1 రూ.
కవిసార్వభౌముని ప్రశం
సలందిన కావ్యరాజము.
గరుత్మంతుడు అమృత
మిచ్చి తన తల్లి దాస్యమును
తొలగించుట ఇందలి ఇతి
వృత్తము.

వ్యవస్థాపకులు:
అక్కపెద్ది సత్యనారాయణ, P. O. L.
హిందూహైస్కూలు, బెజవాడ.
&
విద్వాన్ పైడిపాటి సుబ్బరామశాస్త్రి.
శాయపురం, ఉయ్యూరుపోష్టు.

త్వరలో

ఆంధ్రశ్రీ

పద్యకావ్యము

వాసంతి

నవల

ప్రవాళం

కథలు